ఓం.

శ్రీసద్గురు నారసిమ్హాపరబ్రహ్మణేనమః.

# విగ్రహారాధనమీమాంస.

ఇయ్యది

బ్రహ్మపురిపు కల్లికోట, కాలేజి యిలాకా

ప్రయిమరీస్కూల్ మాష్టరగు

పూడిపెద్ది - సాంబశివరావు చే,

శ్రుతియుక్త్యనుభవంబులతో

లిఖించబడినది.

చెన్నపట్టణము

ప్రాతచాకలపేటయందుండు

పమ్మి - త్యాగరాయసెట్టిగారి

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

1915. సం.

వెల ౩ అణాలు.]



శ్రీరస్తు.

శ్రీసద్గురుభ్యోనమః.

# విగ్రహారాధనమీమాంస.



ఓ సోదర సోదరీమణులారా! ఈ యఖండ భూమండలంబున
సర్వజన హృదయాంతరంగంబున విగ్రహారాధనమను ప్రశ్న వేదన సం
దేహంబు గలవారలై యొకరి నొకరు వాదులాడుచున్నారు. కొందఱు
విగ్రహారాధన కూడదని, మఱికొందఱు కూడునని, సకల దేశముల
యందు సభలు జేయుచున్నారు, సభలుజేసి యున్నారు, యింకనూ
సందేహము దీరక నున్నది. విగ్రహారాధనము గూడు ననుటకును
గూడదనుటకును, యీ విధినిషేధంబులు మనోవికారంబైనది. ఎట్లా
గనిన, అత్తగారు తనకోడలికు రంకుతనము గూడదని బుద్ధి సెప్పి
తాను రంకుబోయినట్లు, మనస్సే యీ విగ్రహారాధనగూడునని గూ
డదనిసెప్పి తుదకు నదే లేకపోవుచున్నది. ఈ రహస్య మెఱుంగ
కుండలోకులు యభిమానంబుతో తెలియక పోరాడు చుందురు.
అయితే నిపుడు యీ విగ్రహారాధన మెందుకు చేయవలెనో యెందుకు
చేయగూడదో, యీ కారణ కార్యములుచూపి యీ మతములకు
హితోపదేశంబుచే సతముగాదని సమ్మతింపజేసి, మరీ హితము జేయ
బడుచున్నది. కాబట్టి ఓ విద్వజ్జనమణులారా! నాకుందోచినంతవఱకు
(సైంటుఫికు రీజనులతో) వ్రాయబడుచున్నది. సావధానముతో నాక
ర్ణించ వేడుకొనుచున్నాను. ఈ లోకంబులో సకల మానవులకు త్రివిధ
యానందములుగలవు. అవ్వేవన, 1 విషయానందము. 2 విద్యానందము,
3 బ్రహ్మానందము వాటిలో విషయానందమున నింద్రియములచే పొంద

బడిన యానందమునకు పేరు. విద్యానందమనగ, నంతఃకరణ మనగా మనస్సు, బుద్ధి, చిత్తము, యహంకారము, ఈ నాలుగుకలిగినవాటికి యంతఃకరణమనిపేరు. దీనిచే పొందఁబడినదానికి విద్యానందమనిపేరు. లోకములో బహు తరుచుగా విషయానందమును, విద్యానందమును, రెండానందములు గలవు. ఇక బ్రహ్మానందమన, యా యంతఃకరణ చతుష్టయము లేకుండను పొందఁబడినదానికి బ్రహ్మానందమని పేరు. ఈ బ్రహ్మానంద మనుభవించేవారు, బహు స్వల్పముగా నుందురు. అట్టివారికే విగ్రహారాధన చేయనవ్వును. చేయరాదనే విధి నిషేధములుగా గలిగించే మనోలయమునొందినవారలు ఇట్టి బ్రహ్మవేత్తల లక్షణ మెట్లనిన, శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞాన మూర్తిం। విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం। ఏకంనిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం। భావాతీతం త్రిగుణరహితం సద్గురుం త్వం నమామి॥ అయితే బ్రాహ్మణమతస్థులు క్రీస్టియన్ మతము, బౌద్ధమతము, మహమ్మదుమతము, మఱికొన్ని మతస్థులు విగ్రహారాధనము గూడదని మానసికారాధనమే శ్రేష్ఠమన్ని బోధించుచున్నారు. సరే, బాగా నున్నదిగాని, యింద్రియములు లేనియెడల మనస్సు సంచార మెట్లగును? మనస్సులేనిదో యింద్రియములు వ్యాపారముఁ జేయఁజాలవు. మనస్సు యింద్రియములపైని రాజైనను, యింద్రియములు మనస్సునకు భృత్యులైనను యొకదాని సహాయము మఱియొకటికి లేని పక్షమున యసలు పనిపాట్లే జరుగలేవుగదా! ఒక యింటికి కిటికీలు నాళాలు యున్నట్లు, దేహమునకు యింద్రియములు తగిలియున్నవి. శ్లో॥ సూర్యకాంతా యథాచాగ్ని శ్చంద్రకాంతా యథాజలం। యథాగ్నౌ లోహితశ్చైవ కాఠిన్యంచ యథాస్థితం। బీజాంకురో యథా వాయు స్పర్శస్తే షాం యథాపివా। చంద్రచంద్రిక యోరేవ యథాదేహాత్మనో స్తథా॥ దీని సారాంశమేమన, చంద్ర చంద్రికలవలెనే దేహమునకును, మనస్సునకును, యభిన్నము. మనసెట్లుచలించిన యెడల

నటులనే యింద్రియములు చలించును. ఇంద్రియములకంటె మనసు వేఱుగుట చేతనే గదా! యింద్రియమ్ములచేత నారాధనముఁ జేయకూడ దని కేవలము మానసీకారాధనముఁ జేయవలయునని గదా, మీఁద నుదహరించిన మతములవారి యభిప్రాయము. తథాభవతు, అయితే నామనస్సే కోట్లు, హారము, నెక్టాయి, బూట్సు మొదలైనవి ధరించరాదా? మఱియు నామనస్సంగోట మనస్సే తిండితినరాదా? అదే టోపి ధరించరాదా? మఱి దేహమున కెందుకు ధరించబడవలెను? ఆ తిండితిప్పలు యీమనస్సే తినవలెను గాని, మఱినోరెందుకు నమిలి మ్రింగవలెను? ఆ మనస్సే స్నానము చేయించి కొనవలెనుగాని, తల కెందుకు స్నానము చేయింపఁబడవలెను? ఈప్రశ్నలకు మీఁద నుదహరించిన మతస్థులేమని సదుత్తరము లిచ్చెదరో గదా! సంస్కారీజనుతో సదుత్తరము లిచ్చినచో వారిబోధప్రకారము విగ్రహారాధన చేయకూడదు. మఱియు విగ్రహారాధన చేయవచ్చునన్న వారునుఁగూడా సదుత్తరము లిచ్చేయెడల విగ్రహారాధనముఁ జేయవచ్చును. మఱియొక రహస్యముఁ గలదు. అదేమన విగ్రహారాధనము చేయవచ్చునన్నవారికిని, చేయకూడదనేవారికిని, మనస్సుయొక్క వ్యాప్త్యర్థము. దాని మర్మధర్మములుఁ దెలియక పోట్లుటచేతి నట్లు పోరాడుచున్నారు. కావున, యో నవనాగరీకులారా! సావధానముఁగా నాకర్ణించవేఁడెదను. యా - మా - నా - మాయ అనఁగా, యా = ఏది, మా = లేనిది, నా = అది, మాయ = అనఁగా. కాలత్రియమునందు నేది లేనిదో యదే మాయ యనఁబడును. మనస్సు యిది మంచిది, యిదిచెడ్డదని విచారించి చెడ్డదానిని విడిచిపెట్టి మంచిదానిని పట్టుకొనక సకల వస్తువులందును, యాశగలిగి, గ్రామ శునకమువలె నిక్కడికక్కడికి నలుగడల వ్యర్థముఁగా తిరుగుచుండును. స్వర్గమర్త్య పాతాళ లోకముల వఱకు నొక క్షణములోపల తిరిగితిరిగి సంచరించుచుండును. ఇట్లు మనస్సు నలుగడల సంచరించుటవల్లనే యెల్లవారికి జనన మరణ దుఃఖంబులుఁ గలుగు

చుండును. ఇట్లు మనసు విషయ వాసన లోలత్వముగలదై, సింహము సంకెళ్లగొలుసుచే కట్టఁబడినట్లు, సత్సారములోఁ దగులుకొని సుఖదుఃఖ ములనుభవించుచు జనన మరణ సాగరంబున మునిఁగి యల్లలాడు చుండును. మనస్సు దేనిని దేనిని స్మరించుచుండునో, యాప్రకారముగానే జీవునికి జన్మము గలుగును. ఈమనసో వాసన తనకిష్టమగు విషయము లను సంకల్పించుకొని యా విషయములందే పరుగెత్తుచు పలుమారు యావిషయములందే ప్రవర్తించుచుండును. చిత్తచాపల్యములనఁగా, ప్ర పంచవిషయములను, యాప్రపంచవిషయములనుగురు తెరుగు శుద్ధతెలి విని యారెంటిని యీమనస్సు స్మరించుచుండుటవలన దీనిని మనస్సని చెప్పఁబడుచున్నది. సంకల్పమే మనస్సు, ఆసంకల్పము మనస్సుకంటె వేఱుగాదు. ఎక్కడను సంకల్పములుండునో యక్కడనే మనస్సుండును. మనస్సు చంచలమైనదని యర్జునుఁడు కృష్ణమూర్తి నడిగితే నీవు చెప్పిన మాట నిజమేగాని, అభ్యాసమువల్లనున్ను, వైరాగ్యము వల్లనున్ను, సాధుసాంగత్యమువల్లనున్ను, మనస్సు నిశ్చల మగునని యుత్తరవిచ్చి యున్నారు. వైరాగ్యమనఁగా సాధనచతుష్టయము. శా॥ వైరాగ్యంబు దృఢంబుఁజేసి పరతత్త్వజ్ఞానమార్జించిస। ర్వారంభోపరంబుఁగైకొని తురీ యంబంది యూరీతియో। గారూఢుఁడగు వానికిం గలుగునే యాగామి యుక్తసంచిత। ప్రారబ్ధంబులు సంతతంబును బరబ్రహ్మాత్ముఁడై యుండ గాన్॥ తే॥ సాధన చతుష్టయంబుల సామ్యమెఱిఁగి। వింతలన్నియు మదిలోన విడచింపుడి। మంత్రసంబగు గురుభక్తి మహిమయగును॥ విశ్వదాభి॥ సాధన చతుష్టయ మనఁగా నిత్యానిత్యవస్తు వివేకము ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాది షట్కసంపత్తి, ముము క్షుత్వము, ఈ నాలుగు సాధనలకె వైరాగ్యమని చెప్పఁబడును. వీటిలో మొదటిదైన నిత్యానిత్య వస్తువివేకమును గురించి విచారించె దము. ఇందును శ్రుతేమని జెప్పుచున్నదనఁగా "నిత్యానిత్య వస్తువివే కేన పునస్సంసార నివృత్తిః। తద్వినా జన్మకోట్యాపి బంధచ్ఛేదో

నసిధ్యతి॥" అనఁగా నిత్యానిత్య వస్తువివేక విచారణ లేనిదే కోటిజన్మ ములకైనను ఘోరదుఃఖ సంసారమును దాటలేరు. నిత్యమనఁగా నెల్లప్పు డుండునది. అనిత్యమనఁగా కొంత కాలముండి స్థితి లేనిది, ఇందు కుదాహరణమేమన, ప్రాక్కాలు మొలగు దేహంగుళ, యని త్యమైనది. నిత్యమనుదాని కర్థమేమన, ప్రాక్క బ్రహ్మమే నిత్య మైనది. తదతరమైన రూప నామ గుణ క్రియాలు గల దేహేంద్రియ ప్రపంచంబు లనిత్యంబులు గిని పరిన సేమన, "బ్రహ్మసత్యం జగన్మి థ్యని" తాత్పర్యము. బ్రహ్మమన, మనము పుట్టకపూర్వమును, పుట్టిన తరువాతను, పోయిన తరువాతను, కాలత్రయము నందును, చలిం చక స్వతసిద్ధముగా సర్వదేశములయందును, సకల వస్తువుల యందు నున్నదేదియో యదే బ్రహ్మశబ్దమున కర్థము. ఇందుకు శ్రుతి ప్రమా ణము॥ బృహిన్ - బ్రహ్మ - వృద్ధా - బృహత్వాత్ - అర్థానుగ మాత్ - దేశతః - కాలతః - వస్తుతః - అపరిచ్ఛిన్నం - యద్వస్తు - తద్ బ్రహ్మేతి - భాష్యం॥ అని యున్నది. అయితే తనకు బ్రహ్మసత్య మును జగత్ మిథ్యతమును రుజువుకావలెను గాని, భావనమాత్రము పనికిరాదు. జగత్ ఇతి గాయతే - జగత్, అనఁగా, తన యరకాలి బొట్టనవ్రేలు మొదలు శిరస్సు పర్యంతముగల భాగమునకు జగత్తని వేదాంత శాస్త్రముల లోని రహస్యము. ఇందు కుదాహరణము వ్రా యఁబడుచున్నది. "పాతాళమే తస్యహి పాదమూలం నత్యంతు శీర్షాణి సహస్రశీర్ష్ణః" అని శ్రీభాగవతము మనుష్యదేహమునకే జగ త్తని వేదాంతసిద్ధాంతము, అయితే నిందుకు స్వానుభవజ్ఞాన దృష్టితో విచారించి చూతము. ఇందుకు కొందఱు పండితు లేమని రనగా, సమాధి సుషుప్తులలో రూపనామగుణక్రియలుగల దేహేంద్రియ ప్రపం చంబులు పోవుచుండునని సమాధానపరుచుకొని యూరకుండిరిగాని, యదెట్లని లోతుగా విచారించినవారుకారైరి. అయితే సమాధియను

శబ్దము స్వానుభవజ్ఞులకు దెలియును. సుషుప్తి యందక్షికి తెలియును. సుషుప్తిలో నామరూప గుణక్రియలు గలదేహేంద్రియ ప్రపంచంబులు పోవునని, తిరిగి నా సుషుప్తి విడిన గానే దేహేంద్రియ ప్రపంచంబులు వచ్చునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. అయితే సుషుప్తిలో నేది వచ్చును పోవుచున్నదో విచారించక వారి యిష్టము ప్రకారమనుకొను చున్నారు ఇందువేమనగారి యనుభవమును చూడండి! క॥ వచ్చున దియుఁ బోవునదియుఁ జచ్చునదియుఁ గనంగలేక సహజములనుచున్ । విచ్చల విడిగాఁ దిరుఁగుట। చిచ్చునంబడినట్టి మిడుత చెలువమె వేమా॥ అనఁగా సుషుప్తిలో నేది వచ్చును పోవుచున్నదో గ్రహించలేక చెడి పోవుచున్నారని సారాంశము. స్వానుభవజ్ఞాన దృష్టిచే విచారించు నెడల నేదివచ్చుచు పోవుచున్నదో తెలియును. నందంటె నందిని, పందంటె పందిని నమ్మియున్నవారి కేమి తెలసును? అసలు వేదాంత శబ్దము నకే నిజార్థమును గ్రహించలేక కొట్టుకొనుచున్నారు. శ్లో॥ నదృశ్యతి నగచ్ఛతి నపశ్యతి నకాంక్షతి । వ్యాప్యవ్యాపక యోరన్యం తల్లింగం పరమం ప్రభుః॥ నిజమైన వేదాంతము స్వస్వానుభవము దెలిసికొని, దానిని దాటిన మహానుభావులకే దాని ధర్మమర్మములు దెలియగ లవు. తక్కిన శుష్కవేదాంత సిద్ధాంత సూటి పరుల కంఠమాత్రము దెలియఁబడును. నిద్రావస్థలో నున్న స్వాభావికంబైన యుచ్ఛ్వాస నిశ్వాసంబులైన స్వకర్మసూత్రం బుండునపుడు దేహము, యింద్రి యంబులు, జీవుఁడు, మనస్సు మొదలగునవి యన్నియుఁ జడములై పోయినవిగదా! బ్రాహ్మ్యమతస్థులెట్లు మానసికారాధనము సల్పెదరో యేమి దెలియకుండనున్నది. మఱియు విగ్రహారాధనము జేయవచ్చు నన్నవారి మతమెక్కడకు పోయినదో గదా! ఇట్టి నిద్రావస్థలో సకల మతములు హతమై పోయినవిగదా! ఈ రహస్యమునుఁ దెలియలేకుండా మతముల విషయమై లోకమునందు యభిమాన కలహలచే మాయవశమై దొడదని తెలియని వాదనలు సల్పుచున్నారు. మతమనగా మనస్సు

కుడును విగ్రహారాధన చేయవచ్చునన్నవారి మతమును, చేయగూడదన్నవారి మతమును యింక నితరులైనవారి మతమును సహేతుకరంబుగా సమ్మతితో హితంబుగా హితోపదేశంబు చేయఁబడుచున్నది. సుషుప్తియే నిత్యమరణమని యెట్లనఁగా? నిద్రయనుదానికి వ్యుత్పత్త్యర్థము వ్రాయఁబడుచున్నది. అదేమన, "నిశ్శేషం ద్రావ ఇతి నాశయతీతి నిద్రః॥" అనఁగా నిద్రావస్థలో నేమిలేకుండ నోటిలో తడియింకిపోవును. అప్పుడు మాత్రము యుచ్ఛ్వాస నిశ్వాసంబులు (ప్రాణాపానంబులు) నాశికము ద్వారానే వచ్చుచు పోవుచుండును. అందువల్లనే నిద్రలేవగానే నోరుకంపు గొట్టుచుండును. అప్పుడు కొండనాలుకలో (దీర్ఘఘంటిక) ని సుషుమ్నానాళంబు ద్వారా తెలివి సహస్రారంబునకుఁ జేరున. అప్పుడు తక్కిన భాగమంతయు మబ్బువలె గ్రమ్మి చిట్టచీకటిగా నుండును. సుషుప్తి దాటుటకే వేదాంతశాస్త్రము లుత్పన్నైనవి. ఇందుకు శ్రీ మహాయోగ పురుషులైన శ్రీ వేమనగారి యనుభవము వ్రాయఁబడుచున్నది. ఆ॥ నిద్రలోని నిద్ర నిజముగాఁ దెలిసిన । భద్రమగును విద్య బ్రహ్మవిద్య । నిద్రదెల్పి సతఁడె నిజమైన యోగిరా। విశ్వదాభి॥ ఎన్నివేలదివ్య సంవత్సరంబులు తల పగిలగొట్టుకొన్నను నిద్రదాటలేనివాఁడు యోగికాఁడు, వేదాంతికాడు, భక్తుఁడుకాడు, జ్ఞానికాడు, అవధూతకాడు, పరమహంసకాడు, బ్రహ్మచారికాడు, యద్వైతికాడు, రిషార్మరుకాడు, బ్రాహ్మణ్య మతస్థుఁడుకాడు, సన్యాసికాడు, యతియునుఁగాడు, వేదాంతమునకు మూలమదంపే నిద్రానుభవము. దానిని దాటినవాఁడే దేవుఁడు. ఇందుకు ప్రమాణమేమన, ఆ॥ మాయపోవు విధము మనుజుఁడు దలఁచిన। మంచి మార్గముల్గగు మానవులకు। మాయ దాఁటలేని మనుజుఁడు వ్యర్థుఁడు। విశ్వదాభి॥ మఱియును, సీ॥ మాయ ద్రొక్కుడు దారి మర్మంబు లివియని - దెలియఁజెప్ప వినరు తేటగాను। జనులందఱుకు బుద్ధి చాంచల్య మునుమాని - బాగులేక వినరు జగతిలోను । విన్నమాత్రములోన విజ్ఞాన మమరును - పాపాత్ములు వినరు

పట్టుగాను । కామ్య కర్మంబులు గట్టిగా సేయుచున్ - కరుణించి విడరుగా కలియుగమున । గాన నీకోత్స్యమోక్షముఁగని కలుషమతులు। బ్రహ్మమనని భావింప బ్రాలుమాలి । నరక కూపముఁ బడుదురు నయముగాను। విశ్వదాభిరామ వినరవేమా॥ కావున, క॥ జాగ్రత్స్వప్న సుషుప్తుల। మార్గములను మించువాఁడె మహితుఁడు భువిలో । స్వర్గాపవర్గ నిలయము । భర్గుని కైవల్యపురము బాగుగ వేమా॥ కొందఱు యుట్టికెగరలేరు. వరే గదా, స్వర్గమునకెగరబోయినట్లు సుషుప్తియనే మరణమును దాటలేక బ్రహ్మవిద్య నభ్యసించ బోవుచున్నారు. బ్రహ్మవిద్యనే మాట నోట నుచ్ఛరించుటకు బహుసులభమేగాని దాని స్వానుభవజ్ఞానము మిక్కిలి దుర్లభము. నిండుకుండ తొణకదు, సగము నీటికుండ తొణకును, అనుభవము గలవారలు బంగారమువలె బహునెమ్మదిగా పలుకుదురు. అనుభవము లేనివారు కంచువలె కంగుమని వాగుచుందురు. నిద్రే ప్రకృతి యనఁబడును. పైంగళోపనిషత్తులో నిట్లు చెప్పఁబడియున్నది. అదేమన, ఎండమావులందు తోచిన జలము రీతిగా నఖండ సచ్చిదానంద పరబ్రహ్మమునందు తనకు తానే తోచినట్టి బుద్ధి రూపమైన మహామాయాశక్తియే ప్రకృతి యనఁబడును ఆప్రకృతియే సత్త్వరజస్తమో గుణములుగా మారఁబడుచుండును. ఆ ప్రకృతియే ఈ చరాచరాత్మకమగు మహాజగత్తును సృష్టించెను. శ్రీభగవద్గీతానవమాధ్యాయములోనిది శ్లో॥ సర్వభూతాని కౌంతేయ! ప్రకృతిం యాంతి మామికామ్ । కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం॥ అనఁగా సమస్త భూతములును సుషుప్తిలో లీనమగుచుండును తిరిగి సుషుప్తిలో నుండియె వచ్చుచుండును. మఱియును, శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః । రాక్షసీమాసురీం ప్రకృతిం మోహినీం శ్రితాః॥ అనఁగా వ్యర్థములైన యాశలును, వ్యర్థములైన కర్మలును గలవారును,వ్యర్థమైన జ్ఞానము గలవారునునగు నవివేకులు మోహమును గలుగఁజేయునదియు, హింసాయుక్తమైనదియు, యసుర

స్వభావ మైనదియునగు మాయనే యాశ్రయించిన వారలై నన్నవమా
నించు చున్నారని భగవద్గీతలో నున్నది. ప్రకృతి నేదానికి వ్యుత్పత్త్యర్థ
మేమన, ప్రకర్షేణ-క్రియతే- జగదారంభ-మనయేతి- ప్రకృతిః॥ అనఁగా
జగత్తు సృష్టి దేనిచేత నారంభ మగుచున్నదో, దానిని ప్రకృతి యనఁ
బడును. సముద్రజలము యలలు, బుగ్గలు, నురుగులు, యుప్పంగా నగు
నటుల మనస్సనెడి మాయే ప్రకృతిగాను, యవిద్యగాను, చైతన్యము
గాను, తెలివిగాను, యహంకారముగాను, దేహిగాను, యజ్ఞానముగా
ను, తమస్సుగాను, కారణదేహముగాను, యవ్యక్తముగాను, మార
బడుచున్నది. ఆ యన్నియు పర్యాయపదంబులుగాని, యన్యంబులు
గావు. ప్రకృతి యనఁగానేమో మాయయనఁగా నంతే. ఏది కాల
త్రయమందును లేదో యదే మాయయని యింతకుముందే వ్రాయఁ
బడి యుంచియున్నది. లేనిదానిని సత్యమనినమ్మి, చేయుచున్న విగ్రహా
రాధన, మానస కాసాధనలు కూడను కూడదని చెప్పుచున్నారు.
అట్టివారు విపరీతజ్ఞానులు గనుక నిట్లు చెప్పుచున్నారు. ఇందుచే
తనే శ్రీభగవద్గీతా నాల్గవయధ్యాయములో నిట్లు వ్రాయఁబడియు
న్నది. అదేమన, శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభా
గశః। తస్యకర్తార మపిమాం విద్ధ్యకర్తార మవ్యయం॥ అనఁగా, మాయ
యొక్క త్రిగుణ కర్మములనుఁబట్టి మనోబుద్ధి చిత్తాహంకారము లనెడి
నాలుగు జాతులు పుట్టినవి. వంధ్యాసంతతివలెనే (గొడ్డుదాని సంతతి
వలెనే) ప్రకృతిలోనుండి మనోబుద్ధి చిత్తాహంకారములు గలిగినవి.
ఆ వంధ్యాపుత్రోత్సాహములో నందఱు సంతోషించుచున్నారేగాని,
అది నిజమైన బ్రహ్మానందము గాదని మొదటి పేటలోనే వ్రాయఁబడి
యున్నది. లోకంబుల్లో తుచ్ఛానందములకే మనసొప్పు చుండును.
ప్రకృతి శాస్త్రములయందు బహుప్రీతి నుంచెదరు. సమ్మతమైన మత
ములోఁటి యేమతము పనికిరాదు. సత్యమైనదే సమ్మతము. మిథ్యా
మతములన్నియును సుషుప్తిలో నేమైనవో, విచారించండి! ఇందులో

నన్ని పతితములును నన్నగిలి పోయినవి. అందునిమిత్తమే, ఈ కాయ మనిత్యమున్ తెలివిగానక మంత్ర లయాదియోగసో । పాయములైన సిద్ధులను ప్రజ్ఞలుగా దలపోసి మూఢులై । మాయల నందువారు నిజ మంత్రపు యోగులు గాని ముక్తికిన్ । డాయగలేరు వీరలకు సంభవం మోక్షము లెంచిచూడగన్॥ అనఁగా, నీసుషుప్తిలో స్థూలసూక్ష్మభో గప్రదంబులగు కర్మంబులు లేవుగనుక దేహములేదు. ఉన్నట్టేమి స్వప్ర హాయుండనే యూహను. కావున దేహము నిత్యమైనది గాదని స్వానుభవ దృష్టిచే తెలియఁబడును. ఎన్ని శాస్త్రములు వెదకి జూచినను సుషుప్తిదాలవలెనని చెప్పుచునే యున్నవి. ఆరహస్యము నెఱుఁగకుండా నున్నారు. మేలుకొంగానే నిద్రకంటె నేమి వచ్చుచున్నదనఁగా, సర్వమును గ్రహించుచుండు తెలివివచ్చుచున్నది. పోవుచున్నదిగాని, నామరూప గుణక్రియలు గలదేహేంద్రియ ప్రపంచంబులు రావడములేదు. పోవడములేదు. ఇందుకు మఱొక దృష్టాంతము వ్రాయఁబడుచున్నది. అదేమన, చిన్నబాలురు దాగుడుమూతలాటలో గిరగిర తిరుగుచుండురుగదా? అప్పుడు బాలురేమనుకొనెదరనగా, భూమి, యిండ్లు, చెట్లు తిరుగుచున్నట్టు భావించెదరు. అయితే నాభూమి మొదలగునవి తిరుగుచుండునా? లేక తాను తిరుగుచుండునా? ఆలాగునే సుషుప్తిలో తానైన తెలివే వచ్చుచు పోవుచుండునుగాని, దేహేంద్రియ ప్రపంచంబు లెంతమాత్రమును రావడములేదు. పోవడములేదు. ఇందుకు శ్రీభగవద్గీతలో నిట్లు వ్రాయఁబడియున్నది. అదేమన, శ్లో॥ అథచైతన్యం నిత్యజాతం నిత్యంవా మన్యసేమృతం । తథాపి త్వంమహాబాహో నైనం శోచితు మర్హసి॥ అనఁగా తెలివి రోజు వచ్చుచుపోవుచున్నది. తెలివిపోయిన తరువాతను, తెలివి రాకమునుపును నీకేమి తెలియఁబడదు. అందు నిమిత్తమెందుకు దుఃఖించెదవు? అని శ్రీకృష్ణ భగవానులవారు యర్జున కుపదేశించి యున్నారు. ఇందును ఒరియా బ్రహ్మగీతలో నిటు వ్రాయఁబడి యున్నది. అదేమన, (లాగి - వొల్గాగా

తోషాంగె - సిహాచోప్యయి - దింతిలె - లోభిబు - గౌతి । జిహాబెళె జీభా సెహిశాకు జిబా - సెహిటి - మోహా - ముగౌతి॥) అనఁగా, సంయోగ వియోగములు రెండును నీదేహములోనే నిత్యము జరుగుచున్నవి. జీవుఁడు నిత్యముక్తి పొందుననే యున్నాఁడు. సుషుప్తి దాటలేని యజ్ఞానులు దాని మర్మమును గ్రహించ లేకుండానున్నారు. మంచిది, యీ తెలివి జీవుని ధర్మమో? కాదో, విచారింతము. ఈ తెలివి జీవుని స్వభావమైనదో జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి కాలత్రయమందు నేకమాస్తరుగా నుండక జాగ్రత్స్వప్నంబులలో సగఁబడి, సుషుప్తిలో నెందుకు లేకపోవుచుండును? తెలివి జీవుని స్వభావమైన యెడల నాజీవుని నంటే యుండవలెనుగాని, మరెందుకు వేఱగుచున్నది? ఒక పంచాదార చక్కెరయందున తీపు యీ పంచదార చక్కెరయొక్క స్వభావము గనుక నా చక్కెరయందు సదా నంటిపెట్టి యుండును. ఆప్రకారము తెలివి జీవుని ధర్మము కాదుగాని, యదివేఱగు పదార్థము. ఇకను లోకానుభవము విచారించెదము. నేనునిద్రపోతిని, తనకు తెలివి రాలేదని చెప్పుచున్నారుగాని, జీవుఁడు రాలేదని చెప్పడములేదు. కాఁబట్టి జీవుని కంటె తెలివి వేఱగు పదార్థము. ఈతెలివి యుండుటా చేతనే సకలమైనవారికిని సుఖదుఃఖంబులు, పుణ్యపాపంబులు, స్వర్గనరకంబులు, మొదలైనవనియు గలుఁగుచుండును. ఈ తెలివిచేత చిత్రవిచిత్రమైన దేవకృత్యంబులగు రైల్వే, టెల్లిగ్రాఫ్, ఫోనోగ్రాఫ్, మోటరుకారు, మొదలైనవి చేయఁబడుచున్నవి. ఈపదునాలుగు భువనములు దానిచేతనే సృష్టించఁబడినది. క॥ ఇనుడస్తమించుతతినా। తనికిరణములతనితోఁడ దగఁడనురీతిన్ । బెనుమాన నంభుపొలిసిన । మునుకొని తద్గత వికారము పొలియుఁ గనుఁగ॥ సూర్యుఁడుదయించిన యెడల నాతనికిరణము లతనితో వచ్చునట్లు తెలివి రావడముతోడనే సుఖదుఃఖంబులు మొదలగు ద్వంద్వంబులు వచ్చుచుండును. తిరిగి నాతని కిరణము లాతనితో పోయినట్లు తెలివి సుషుప్తిలో నస్తమించగానే యూను

ఖదూఖములు దానితో లీనమగు చుండును. నిత్య మిట్లగుచునేయున్నది. అయితే నట్టి తెలివే సర్వము సృష్టించుచున్న గాని దానినిసృష్టించేదేదియునులేదు. ఇందుకు వేమనగారి యనుభవమును వ్రాయుచునుచున్నది. క॥ చిన్నది మొల ప్రాయంబున । గన్నది పతిలేకసుతుని కనుచిత్రముగా । సన్నను రతికేళియుగను । చన్నియ్యక పెంచెనదను జగమునవేమా। ఆ॥ చిత్రమగుత్రమహిమ సిద్ధికిచిన్నది। పుత్రునిభువిగనెను పూర్వమందు। తండ్రిలేనిసుతుండు ధాత్రినిఏలెరా॥ వి॥ మఱియును,క॥ సకలము నాకలి కొఱకై । నిఖిలాత్ముండు పెట్టినటుగు నీచపు గుణముల్। సకలంబై తాఁ జంపును। వికటారూ వస్తువెవ్వ రెందురువేమా॥ అటుగా నా వస్తువు తెలివే సుమండీ! ఓ విగ్నజ్ఞులారా! ఈ లోకంబులో నన్ను గ్రహించిన నీ తెలివిచేతనే సుమండీ! గాని తెలివియొక్క మహా రహస్యంబులు తెలిసికొన లేకున్నారు. ఆహా! ఇదేమి యాశ్చర్యము! లోకములో నొకానొకఁడు గొప్ప బుద్ధిమంతుడని, మహా తెలివిమంతుఁడని శ్లాఘించెదరు గదా! ఆ తెలివెంతయున్నది? అదెక్కడున్నది? దాని స్వరూపమేమి? మఱియు దాని ప్రమాణమేమి? ఈ ప్రశ్నలు వేసినచో యేమి జవాబు చెప్పనేలేరు. కాకుల కూతలులాగు కూయుచుందురు. ఇందుకు వేమనగారి స్వానుభవ నీయమగు పద్యమును చక్కగా నాలకించండీ! అదేమన, క॥ శ్రుతియు త్వనుభవము లేకయె। మతిహీనుని బల్కినట్టి మాటలు చూడఁగ। సతమని నమ్మఁగ రాదది। యతులితమగు పూర్ణపదవి యందదు వేమా॥ మఱియొకటి వినుఁడీ! క॥ ఎక్కడి చదువులు బోధలు । మక్కువ ననుభవములేని మాటలు వినఁగా । ఫుక్కిటి పురాణములకే । జక్కుల సంతోషమిలను సద్గుణవేమా॥ అయితే నీ తెలివియొక్క పూర్వోత్తరములు తెలియనివారు విగ్రహారాధన చేయువచ్చునని, చేయరాదని వాదులాడెదరు. లోకములో నన్ని తెలిసికొనిన, నీ తెలివే తెలిసికొనుచున్నది. తుదకు నిదే మిగులుచున్నది, ఇందుకు ప్రమాణము. ఆ॥ చదువులన్ని చదివి చాల

వివేకినై। మగుడి తన్నెఱుఁగక మంద జనుము। వ్యర్థ చదువు చదివి వెఱ్ఱి
నై చెడిపోవు॥ విశ్వ॥ ఆహా! మహాలోక విచిత్రము చూడండీ! అ॥ చదు
వులన్ని చదివి సర్వజ్ఞుఁడయ్యెను । బ్రహ్మవిద్య లెల్ల పదటఁ గలిపి ।
ముదికి శ్మశానిఁ జూచి పరమయోగము మానె॥ విశ్వ॥ దీని యనుభవ
మేమనఁగా నీ లోకంబులో నెంత వేదాంతశాస్త్రాభ్యాసము చేసినను,
మరెంతటి వాఁడైనను సుషుప్తియనెడి యోనిలో నడఁచుకొనుచున్నాఁ
ము. ఇందుకు శ్రుతి॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం ।
మయి సర్వం లయం యాంతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహం॥ సర్వము
సుషుప్తియనే యోనిలోనుండి జాతమగుచున్నది. తిరిగి నందులోనే
లయము నొందుచున్నారు గదా, ఇట్టి వారికి బ్రహ్మవిద్యయెట్లు సంభ
వించును? సుషుప్తియనే బీజమునుండియే సర్వము పుట్టుచుండునుగదా,
ఒక మఱ్ఱి విత్తనంబులో నంత పెద్ద వృక్షము, కొమ్మలు, యాకులు,
యూడలు, మొగ్గలు, పండ్లు నంతర్భూతమై యుండునట్లు యీ సుషు
ప్తియనే బీజములో నీసర్వ చరాచర బ్రహ్మాండంబు యావత్తు నణగియు
న్నది. దానికటువంటి సత్తాగలదు. ఆసుషుప్తనే బీజము నశించితేనే
గాని మోక్షమెంత మాత్రము లభింపదు. అదెట్లు నశించు ననఁగా,
శ్లో॥ అగ్నిదగ్ధం యథా బీజం శాఖాపల్లవ వర్జితం । జ్ఞానదగ్ధం తథా
యోగి పునర్జన్మ నవిద్యతే॥ ఇతి వేదాంతడిండిమః॥ శ్రీ భగవద్గీతా
నాల్గవ యధ్యాయము ౩౭-వ శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మ
సాత్ కురుతేఽర్జున । జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా॥
దీని యభిప్రాయము సకల మహాజనులకు దెలిసినయంశమే, శ్లో॥ నహి
జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే । తత్స్వయం యోగసంసిద్ధః కాలే
నాత్మని విందతి॥ ౩౮॥ అనఁగా నీ లోకమందు జ్ఞానముతో సమానమై
నదియు, పాపములను బోఁగొట్టి శుద్ధిని గలుగఁ జేయునదియు లేదు. కర్మ
లననుసరించువారు క్రమముగా ముక్తినొందుదురు. జ్ఞానులు సద్యస్కా
లముననే సద్యోమోక్షము నొందెదరు. పాపమనఁగా నేమో। వాయుఁబడు

చున్నది. శ్రుతి॥ దేహోహమితిసంకల్పో మహాపాప మితిస్ఫుటం॥ అమృత బిందూపనిషత్తు రీతిగా దేహేంద్రియ మనోబుద్ధి చిత్తాహంకారంబులే తానని దేహాత్మబుద్ధియే మహాపాపమైయున్నది. ఇంతకన్న మరి పాపము లోకములోనే లేదు. ఇందుకు వేమనగారి యభిప్రాయమేమన, "పాపమనఁగ వేఱె పరదేశమున లేదు। తనదు కర్మములను తగిలియుండు" నని యున్నది. దీనిపేరే, నరకము, సంసారము, యభిమానము, యహంకారము, యజ్ఞానము, భ్రమ, మృత్యువు. మృత్యువనఁగా, మృత్యోస్సమృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥ అనఁగా మీఁద వ్రాసియున్న పాపమునకే యర్థమగుచున్నది. యోగమనఁగా, యుజ్యత ఇతి = యోగః॥ అనఁగా నైక్యమని యర్థము. అయితే దేనికి దేనికైక్యమో తెలియవలెను గదా! తానైన దానికిని సగుణస్వరూపులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు మూలంబైన పరాశక్తి కధిష్ఠానమగు పరిపూర్ణ పరబ్రహ్మమునకును కాలత్రయము నందు నేకత్వము సహజమైయున్నదని స్వానుభవ జ్ఞానదృష్టిచే గ్రహింపఁబడేదానికి యోగమని, మోక్షమని, యద్వైతమని, పంచముక్త్యతీతమని, యరూపమనోనాశనమని నిర్వికల్ప సమాధని, సహజామనస్కరాజయోగమని, బ్రహ్మనిష్ఠయని, విదేహకైవల్యమని మొదలగు పర్యాయ నామములు. ఓహో మూర్ఖవాదులారా! నిష్కారణముగా తనెవరో తనకు తెలియకుండా విగ్రహారాధన చేయవచ్చునని, చేయరాదని, సభలనుగూర్చి యభిమానముతో నుపన్యాసంబు లిచ్చెదరు? అందుకు తగినది వ్రాయఁబడుచున్నది. శ్లో॥ శిలాభావం పరిత్యక్త్వా శివభావం చకారయేత్। శివభావం పరిత్యక్త్వా ఆత్మభావం చకారయేత్। ఆత్మభావం పరిత్యక్త్వా అచలభావం చకారయేత్। ఏవం విజ్ఞాన సంప్రాప్తే సద్యోముక్తి ర్నసంశయః॥ అనఁగా దీని యభిప్రాయమేమన, మిక్కిలి యజ్ఞానావస్థలో దేవుఁడనఁగా నెవరో యెఱుఁగనందున మొదట నొకశిలారూపముగల విగ్రహమునందు మనసు

నిల్పించవలెను. ఈప్రకారము కొంతకాల మనుభవమైన తరువాతను ఆశిలావిగ్రహముకంటె వేఱుగానున్నదని విచారించి తరువాత నాశిలావిగ్రహమం దపేక్షవిడిచి మనస్సులో నారాధించుచుండును. ఈలాగున కొన్నాళ్లైన తరువాతను అవును. యీ మనస్సు సుషుప్తిలో లీనమగుచున్నది. గనుక మానసికారాధనగూడా పోవుచున్నది. తరువాత నాత్మగురించి ధ్యానించుచుండును. తరువాతను పరమాత్మయొక్క స్వానుభవమగును. అప్పుడు విదేహకైవల్యము సంప్రాప్తమగును. ఇట్టి యనుభవము గలవాఁడే నిజమగు రిఫార్మరు. నిజమగు బ్రాహ్మ్యమతస్థుఁడు, ఇందుకొక దృష్టాంతము వ్రాయఁబడుచున్నది. అదేమన, ధనుర్విద్య నేర్చుకొనువాఁడు ప్రథమమునఁ బెద్ద ఎద్ద వస్తువులమీఁదఁ దన గురిని నిలుపును. క్రమముగఁ జిన్నవస్తువులపైని గురి నిల్పుటకు నేర్చును. ఈ విధముగఁ బ్రతిమారూపుఁడును భగవంతునకు రూపముల పూజించిన మనోనిశ్చలతఁ బొందును. కాలము గడచిన తనమనోదార్ఢ్యము హెచ్చిన కొలఁదిఁ బరమేశ్వరుని నిర్గుణరూపమునుఁ బూజింపవచ్చును. ఓహో! బుధజనులారా! ఈ లోకములో ననేకు లితరులకు మతము బోధించుటకుఁ బదులుగా తానే యాకాలమంతయు నీశ్వరారాధనయందు వ్యయపఱచినఁ బాగుండును. ఇదియే మతమును బోధించుట. ఇహలోక వ్యవహారములనుండి తొలఁగి జితేంద్రియుఁడైనవాఁడు నిజమైన గురువు. దిగంతములనుండియుఁ బలుమంది జ్ఞానోపదేశమును వాంఛించి పిలువనిపేరంటమున వచ్చి యిట్టి నిజగురువునకు సేవఁ జేయుదురు. "నేను వికసించితిని నామకరందమును గ్రోలవలసినదని పుష్పమువెళ్లి తుమ్మెదలకుఁ జెప్పుచున్నదా?" మరియొక దృష్టాంతము చూడండీ! నేతినిఁ జక్కగ మరగిపెట్టి యందులో రొట్టెలకై పిండిని వేసినపుడు విశేషధ్వని గలుగును. క్రమక్రమముగ నాధ్వని తగ్గిపోవును. ఆపగిదినే స్వల్పజ్ఞానమును గలిగి యున్నంతవఱకు నరుఁడు పట్టివాదములఁ బెట్టుకొనుచు నుపన్యాసంబుల నిచ్చుచుండును గాని

జ్ఞాని "త్రైలోక్య దుర్లభంబని" యవన్నియు మాని సర్వకాలముల యందు శాంతిగలిగి యుండును "నిజ్జనుండు బల్కు చల్లగానని" చెప్ప బడును. వివేకము విరక్తి గలిగిన మనస్సులేక నూరక శ్రుతి స్మృతులను పఠించుటవలన లాభములేదు. తెలివిచే తెలియఁబడిన వాటిచేత తెలివి తెలియఁబడదు. ఏమన, తెలిసికొనేదానిచేత తెలియఁబడేవి తెలియఁబడునా? తెలియఁబడేవాటికంటె తెలిసికొనేదే ఘనమైనది. కావున తెలియఁబడే భాగవత, భారత, భగవద్గీతా, బాహ్యప్రస్థానత్రయములచే తెలివిని తెలిసికొనలేవు. ఇట్టి సుఖదుఃఖంబులు మొదలగు ద్వంద్వంబులు గలుగఁజేసే తెలివినే (చైతన్యము) అడలేక యంగళము వంకరిన్నట్లు, దాని పూర్వోత్తరంబులు గ్రహించలేక నా తెలివే బ్రహ్మమనిరి. అయితే, తెలిసినా, తెలియకున్నా, తెలివి తెలివై యున్నది. ఎట్లాగనఁగా, వేపాకని తెలిసినాచేదే; తెలియకున్నా చేదే. ఆవేపాకున్నంతసేపు యీచేదుపోదు ఆవేపాకునుదహించినయెడల నాచేదుపోవును. ఆలాగునే తెలివని తానుకొన్నను తానను కొనకయుండినను సుఖదుఃఖంబులు మొదలగు ద్వంద్వంబులుపోవు. ఎక్కడైననువేడినీళ్లవలన ఱుంఢ్లుకాలిపోవునా? దీపముయొక్క పేరున్నంత మాత్రమున చీకటిపోవునా? అన్న మన్నంతమాత్రమున యాకలిబాధతీరునా? కాఁబట్టి తెలివే తానను కొన్నంతమాత్రమున సుఖదుఃఖములు మొదలైనవి పోజాలవు. లోకమున నిట్టితెలివిచేతనే విద్యానందమనుభవించుచున్నారుగాని తెలివిలేని బ్రహ్మానంద మనుభవించలేకుండ నున్నారు. ఇందుకు పెద్దలవాక్యమువిచారించెదము॥ తత్వము॥ పాటగాపాడవలెను॥ జ్ఞప్తిబ్రహ్మం బనుచు బల్కేరు॥జ్ఞానులమని॥ జ్ఞప్తిబ్రహ్మం బైతే సుప్తిలో।సుస్థిరంబుగ నుండవలెగదా॥ జ్ఞప్తి సుప్తిలో నణగినంతట। జ్ఞానమెచ్చట బాయునహా॥ జ్ఞప్తిబ్రహ్మం॥ ఏకతీరుగ నున్నదేదో యదియు బ్రహ్మం బనుచు తెలియక। రాకపోకలు చెలిగె మెఱుకను। ప్రాకటంబుగ నమ్ముకొనుచు॥ జ్ఞప్తిబ్రహ్మం॥ పుట్టు చావును లేని యచలము। బట్టబయలై

యుండగాను। వట్టిమాటల భ్రమలచేతను। మట్టు దెలియక మహిని జనులు॥ జ్ఞప్తిబ్రహ్మం॥ ఈ యానటనముగల దేహమందును తెలివియొక్క రూపము, పరిమాణము, దాని యుత్పత్తి స్థితిలయములు మొదలైనవి తెలిసికొనవలెను. ఇకనెట్లనగా, తెలిసికొనేదిని తెలియఁబడేదిని యొక్కటై యుండవలెను. అభిన్నజ్ఞానము చేగ్రహించబడేట్టు భిన్నజ్ఞానము తానైన తెలివియొక్క నిజరూప సందర్శనము కావలదు. అయితే తెలివిని తెలివే తెలిసికొనవలెను. అందు కేలాగనఁగా॥ శ్రుతి॥ మనసైవ మనశ్ఛిత్వా పాశం పరమబంధనం। భవానుత్తారయాత్మానం నాఽసౌ వక్ష్యేన తార్యతే॥ అనెడి మహోపనిషత్తుగా విషము విషమువల్లను, బాణము దానికి సమానమగు మతియొక బాణమువల్లను, ఖండింపఁబడినట్లు, మనస్సు మనస్సుచేతనైనను, లేక తెలివిని తెలివి చేతనైనను ఖండింపవలెను. అప్పుడు తననిజరూపమగఁబడుటకు సందేహముండదు. అందుకు తెలివినిత్యము ముగ్గడిగా తిరుగుచుండును. ఆముగ్గడియే జాగ్రత్స్వప్న సుషుప్తులు. ఈ తెలివి రోజును ముగ్గడులలో సంచరించుచుండును, వాటిలో నేమైన తెలియునేమో విచారించెదము. రోజును తెలివి వచ్చుచున్నదిగాని, అదెక్కడినుండి వచ్చుచున్నదో యేలాగున వచ్చుచున్నదో మళ్లి యందుకే వచ్చుచున్నదిగాని, దానిరహస్యమేమి తెలియకుండ నున్నది. తెలివి వచ్చేసరికి దేహరూపమైన తరువాత మరీ తెలివి వచ్చుచున్నది. అసలది సూక్ష్మదేహమయ్యేయున్నది. అదిముదరది, యిదిలేతది, తల్లిపిల్లలకు భేదములేదుగా! తెలివి వచ్చుచున్నపుడును దాని నిజరూప సందర్శనము కావలదు. తెలివి యున్నప్పుడు విచారించిన యెడల పాలునీరు రెండు కలిసియుండునట్లు తెలివి దేహము రెండు కలిసియుండును. అప్పట్లో తెలిసికొనదలచిన, తాను తెలివని, మరి తాను దేహేంద్రియ జీవులు కాదని తెలియఁబడుచుండును. అటుపైది లేకపోయె, క్రిందిది కాకపోయె, మధ్యను "నేను నేనని" వ్రేలాడుచున్నది. అప్రమేయ్యగాక, గేదెపెయ్యగాక.

ననుమ దిక్కుమాలిన పెయ్యగా విరహవ్యథ భయములతో నీడ్చు
కొనబడును. ఇకను తెలివి పోయిన నపుడు తెలిసి కొనెడి మనస,
యసలు సర్వము గ్రహించుచు తెలివే పోయిన వెనుకను మఱి
తెలిసికొనే దేది యున్నది? అన్నియు జడంబులై పడియున్నవి.
ఓ సకలమైన మతస్థులారా! ఇందుకు మీ సదుత్తరవు లేమి చెప్ప
గలరు? తక్కటయూకదంపుమాటలేలా? ఇటుపయిని మార్గమేమి?
అభిమానములేని మతమేసమ్మతము? ఓ సంఘసంస్కారులారా! ఇందు
కుత్తర మేమి చెప్పగలరు? ఊపిరివలన బొజ్జ పెరుగనట్లు వట్టిమాటలవలన
తృప్తి గలుగునా? మీసాలు మీది చెమట బిందువులవలన దాహము
తీరునా? పులినిచూచి నక్క వాతలు వేసికొన్నట్లు, అక్కడిక్కడ నేర్చు
కొన్న మాటలవలన బ్రహ్మజ్ఞాని (రిఫార్మరు) యగునా? స్వాత్మానం
దానుభవజ్ఞాన దృష్టికానిరెను. పంట్లలమస్, బూట్సు, ట్రవుజర్సు,
నెక్‌టాయి, క్రాపింగ్ మొదలయిన వాటిచే బ్రహ్మవిద్యా స్వరూపిణి
యగు ముక్తికాంతామణి లక్ష్యపెట్టను. క॥ ఎక్కువ చదువులుఁ జది
విన। చక్కనివాఁడైన రాజ చంద్రుండైనన్। మిక్కిలి రొక్కములియ్యక।
చిక్కదురా ముక్తికాంత సిద్ధము సుమతీ॥ మఱియు నీముక్తికాంత,
యడవియందుండుట వలనను, యనేకములైన గ్రంథములనుఁ జదువుట
వలనను, వ్రతముల ననుష్ఠించుటవలనను, యాగములు చేయుటవలన
ను, ధనము ఖర్చుచేయుట వలనను, యుపవాస శివరాత్రులు చేయుట
వలనను, పుణ్యతీర్థయాత్రలు చేయుటవలనను, బ్రహ్మచర్యము, సన్న్యా
సములగు మొదలగు యాశ్రమములలో నడిచినను లక్ష్యపెట్టదు. దానికి
మనస్సు జయించిన వారిమీఁద మిక్కిలి మక్కువ తక్కిన వారియందు
రవ్వంతైనను కన్నుంచదు. ఇట్లు మహోపనిషత్తునందు చెప్పఁబడి
యున్నది. కాఁబట్టి యన్నిటికంటె మనోజయమే శ్రేష్ఠము. మనోజ
యములేనిదే రిఫార్మరు కాడు. బ్రాహ్మ్యమతస్థుఁడునుకాడు. అసలు
దాని కేమతములేదు. మనస్సునకే యన్నిమతములు అసలు మనస్సే

మతము, మతములేనివారు మహిలోనే లేరు, కావున, ఆ॥ మతము లెన్నియైన సతములై యుండవు। సతములందు నొకటి జగములోన। అన్ని మతము విసువ నరయు నొక్కండు లేండు విశ్వదా॥ ఓ వివేక శిరోమణులారా! తెలివి విడిచినతిరువాతను తెలివి రాకముందునుండే తత్త్వము గ్రహించినవాడే పరిపూర్ణమైన రిషార్మరును బ్రాహ్మ్యమత్థునును తక్కిన వారందఱును వట్టి బూటకులనుమండీ! వారి మాటలు విశ్వసించవలదు. నోటిమాటలకు కరువా? ఇట్టివారే లోకములను పాడు చేయుచున్నారు. ఇదిగో! చూడండి మార్గము కనపరచుచున్నాను. సావధానముగా నాకర్ణించవలెను. ఇట్లు తెలివి దేహము రెండు వస్తువులు మారుచున్నవి. అయితే అసలు రెండు వస్తువుల కెన్ని మార్పులుండునో ముందు విచారించి చూడవచ్చును గదా! ఆ మార్పు లేవనగా, తెలివి దేహము రెండు కలిసియుండు మార్పొకటి. తెలివిపోయి దేహముండు మార్పు రెండవది. అందఱికి నీ రెండుమార్పులే కనబడుచున్నవి. వీటికే మెలుక మఱుపులని, సంయోగ వియోగములని, వ్యక్తావ్యక్తములని, పర్యాయపదములు, నిత్యమిట్లునే జరుగుచుండును. ఇందుకు మఱియొక మార్పేమైననుండునేమో విచారించెదము. అదేమన, నొక్క తెలివియుండి దేహము లేనిమార్పుమూడవది. ఇంక మార్పులుండినచో యతివ్యాప్తి పట్టును. గనుక మరి మార్పులుండకూడదు. నండవు ఈ మార్పువలననే సకల దోషములుపోయి నిజరూప సందర్శయోగము గును. దీనిపేరే శాస్త్రాదులలో తురీయమని పేరుగలదు. శరీరమందు గల వ్యాధి మాన్పుకొనుటకు వైద్యుండును మందు నెట్లావశ్యకమో యట్లు చిత్తమందలి మలినవ్యాధి కుదిరించుకొనుటకు సద్గురువును తుర్యామృత రసమును యావశ్యకమై యున్నది. శ్లో॥ గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః। అన్యథా లభితంనాస్తి సత్యం సత్యం పునః పునః॥ మఱియు తుర్యానుభవ మెట్టిదనంగా, శ్లో॥ యదానంద రూపం ప్రకాశస్స్వరూపం నిరస్తప్రపంచం పరిచ్ఛేదశూన్యం। అహం

బ్రహ్మ వృత్త్యైకగమ్యాం తురీయం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥ అని శంకరులవారి యనుభవమైయుండి. శ్లో॥ నిషేధే కృతేనేతినేతీతి వాక్యై సమాధి స్థితానాం యథాభాతి పూర్ణం। అవస్థా త్రయాతీతమేకం తురీయం పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥ అని శంకరులవారి యనుభవము. శ్రుతి॥ ఏకఏవాత్మ మంతవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు। స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ నవిద్యతే॥ ఆత్మదర్శన ప్రకాశ మెట్టులుండుననఁగా, సీ॥ భానుకోటి ప్రభా భాసురంబగు వెల్గు పరులఁజూడఁగారాఁ బడనివెల్గు। గురుకృప చేఁగాక గుర్తెఱుంగని వెల్గు సమదృష్టిచే నమరువెల్గు। విశ్వెల్ల తాపరి వేష్టితంబగు వెల్గు ఘననీల కాంతుల గ్రక్కున వెల్గు। దశవిధ ప్రణవనాదములు గల్గిన వెల్గు మానులెన్నఁగరమ్యమైనవెల్గు। ఆదిమధ్యాంత రహితమై నట్టివెల్గు యిట్టి వెల్గును సేవింప నట్టిచెడ్డ। వారికేల లభించు కైవల్య పదము॥ మవరిపుపాల మునిజన హృదయలోల వేణుగోపాల భక్త సంత్రాణశీల॥ ఇటువంటి తుర్యానుభవము గలవాఁడు సంసారములో నెట్లుండుననఁగా, క॥ లోకము మాయని మదిలో। లోకంబునఁ గలియకుండు లోనగు దెలియుణ్ । మాకుమ్మర పురుగునువలె। లోకంబున నుండుయోగ లోలుఁడువేమా॥ ఓ విద్వజ్జనులారా! ఇట్టి తురీయానుభవము నెఱుఁగనివారు మతమనే గోతులలోఁబడి విగ్రహారాధన చేయవచ్చునని, విగ్రహారాధన విడిచిపెట్టి మానసీకారాధన చేయవలెనని దొమ్ములాడుచున్నారు. "అఱచినకుక్క కఱవదన్నట్లు" వాదము లాడుచున్నవారి కనుభవము సున్నసుమండి! ఇది గట్టిగా నమ్మకొనవలెను. చేయవచ్చును చేయరాదను వారికి భ్రమ తీరలేదని నమ్మవలెను. మానసీకారాధనమెంతో విగ్రహారాధన మంతేగాని యుపాసులకు కొంచెము భేదము. గుడ్డిలో మెల్లనయము. కాఁబట్టి ఓ పండితశ్రేష్ఠవారా! యిందలి దోషంబులుండినను క్షమించగలందులకు మిక్కిలి వేడుకొనుచున్నవాఁడను. తప్పులేనివాఁడు ధరణిలో లేఁడు. శ్రీ బ్రహ్మార్పణమస్తు:—

గద్య.

ఇతి శ్రీ కాశీక్షేత్ర నివాసియగు శ్రీమత్పరమహంసావధూత
దిగంబర స్వాముల ప్రియశిష్యుఁడగు, శంకరమంచి
లక్ష్మీనృసింహంగారి ప్రియశిష్యుఁడగు
పూడిపెద్ది - సాంబశివరావుచే
విరచితంబైన



విగ్రహారాధనమీమాంస.

సంపూర్ణము.



---

వేమనపద్య రహస్యార్థ తాత్పర్య బోధిని. ౧౬౦ పుటలుగల ప్రథమ సంపుటము. ప్రతి ౧కి వెల రూ. ౧ ౦ ౦
వేదాంత కఠిన పదార్థమంజరి వచనకావ్యము. ౦ ౪ ౦
పునర్జన్మ సందేహ నివర్తిని వచనకావ్యము. ౦ ౪ ౦
సద్యోముక్తిబోధిని వచనకావ్యము. ౦ ౫ ౦
వేదాంత ప్రశ్నోత్తర ముక్తావళిఅనెడి గురుశిష్యసంవాదము. ౦ ౬ ౦
అనుభవానంద దీపిక వచనకావ్యము. ౦ ౬ ౦
మృత్యుంజయబోధిని వచనకావ్యము. ౦ ౨ ౦
సహజాద్వైతానుభవప్రకాశిక వచనకావ్యము. ౦ ౨ ౦
సామితల బ్రహ్మజ్ఞాన రహస్యార్థబోధిని వచనము. ౦ ౫ ౦
బ్రహ్మజ్ఞాన ఉపదేశవాక్యంబులు, పరమహంసవిద్య. ౦ ౩ ౦
మనోవ్యాధికిమందు. ౦ ౨ ౦
పాపవిమోచని. ౦ ౨ ౦
హేమతారకవిద్య. ౦ ౨ ౦
జీవన్ముక్తిదాయిని, పుత్రోత్సాహ ప్రదాయిని. ౦ ౩ ౦
సూక్ష్మమోక్షమార్గము. ౦ ౫ ౦
అజ్ఞానధ్వంసిని. ౦ ౪ ౦
విగ్రహారాధన మీమాంస. ౦ ౨ ౦
పరమపురుషార్థ పంచ ప్రశ్నోత్తర రత్నములు. ౦ ౪ ౦
శుష్కవేదాంత సిద్ధాంతుల గర్వాపహారి. ౦ ౩ ౦
వీడేవాడను అను వేదాంత గ్రంథము. ౦ ౨ ౦
గగనవిద్య, బ్రహ్మజ్ఞాన గానామృతము. ౦ ౩ ౦
జీవతత్వప్రబోధ కుసుమావళి. ౦ ౩ ౦
జీవేశ్వర సంయోగ రహస్యము. ౧ ౨ ౦
సుజ్ఞానతత్వ పూర్ణోదయంబను బ్రహ్మగీతా రహస్యము. ౦ ౮ ౦
ఆనందరామాయణము వచనకావ్యము. ఇందు రామాయణ కథయంతయు సమగ్రముగ నున్నది. ౧ ౦ ౦

పమ్మి - త్యాగరాయ సెట్టి,
శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ప్రెస్. పాతచాకలపేట, మద్రాస్.